# శ్రీరామ రక్షా వ్రతం

సాక్షాత్తూ శ్రీ స్వామి వారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రతకల్పము



తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి



ఓం దాశరథాయ విద్మహే
సీతా వల్లభాయ ధీమహి
తన్నో రామచంద్ర ప్రచోదయాత్

శ్రీరస్తు  శుభమస్తు  అవిఘ్నమస్తు

# శ్రీరామ రక్షా వ్రతం

సాక్షాత్తూ శ్రీ స్వామి వారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రతకల్పము




తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి

**శ్రీ డిజైన్స్**

www.lordofsevenhills.com
Phone : 040 - 23833752

హైదరాబాదు
2014

# శ్రీరామ రక్షా వ్రతం

**సాక్షాత్తూ శ్రీ స్వామి వారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రతకల్పము**

**తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి**



First Edition : 2014

**వెల : అమూల్యం**

**కాపీలకు**
**"Viswapathi"**
**T.V.R.K. MURTHY, M.Tech**
Flat No. 202, Plot No. 32,
Srikar's Ravi Residency,
Beside Nalanda High School,
Near Motinagar 'X' Roads,
HYDERABAD - 500 018, India.
Ph : 040 - 23833752.
Cell : 98494 43752
Website : www.lordofsevenhills.com
Email: viswapathi@yahoo.com
shridesigns@gmail.com

Designed & Printed at :
**SRI VASAVI PRINTERS,**
1A, 1st Floor, Ameepet,
Hyderabad. 9989277178.

# నివేదన

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే

శ్రీరామనామం ఎంతో మహిమాన్వితమైనది. ఎంతో శక్తివంతమైనది. సర్వశుభాలనూ అనుగ్రహిస్తుంది. ఎప్పుడూ ఆ రామనామం తలచేవారికి ఎటువంటి ఆపదా కలుగదు. ఆ రామచంద్రుడు ఎప్పుడూ వారి వెన్నంటే ఉండి వారిని కంటికి రెప్పలా కాపాడుతుంటాడు. ఈ రామనామం ఎన్నిసార్లు స్మరిస్తే అంత ఎక్కువ ఫలాన్నిస్తుంది. ఈ దివ్యనామం ఎవ్వరు పఠించటానికైనా ఎంతో తేలికైనది. అన్ని కార్యాలయందు జయమునిచ్చేది.

ఆ శ్రీనివాసుని దయవలన నేను ఇప్పటిదాకా ఆ స్వామి లీలలపై పదహారు పుస్తకాలు రచించడం జరిగింది. అవన్నీ భక్తులను ఎంతగానో ఆనందపరుస్తున్నాయంటే అదంతా ఆ స్వామి అనుగ్రహం తప్ప మరొకటి కాదు. వీటిలో శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పం, శ్రీ లక్ష్మీ నరసింహ వ్రతకల్పం, శ్రీ ఆనంద ఆంజనేయం, భక్తులను ఎంతగానో అలరిస్తున్నాయి. ఈ మూడు వ్రతాలు నిత్యం ఎందరో భక్తుల గృహాలలోను, ఎన్నో ఆలయాలలోను ఆచరింపబడుతున్నాయి. ఇంతకు మించిన భాగ్యం ఏముంటుంది.

నన్ను కొన్ని సంవత్సరాలుగా కొంతమంది మిత్రులు శ్రీరామచంద్రులవారి వ్రతం ఏదైనా రాయమని అడిగేవారు. ఆ రామచంద్రుని అనుగ్రహంతో అది ఇన్నాళ్ళకు నెరవేరింది. ఏ దేవతకు సంబంధించిన పుస్తకాలైనా ఆ దేవతయొక్క అనుగ్రహం లేకపోతే ఒక్క అక్షరం కూడా రాయడం జరుగదు. ఈ పుస్తక రచన కూడా అలాగే జరిగింది. ఒకనాటి మధ్యాహ్న సమయంలో ఒక ఆజానుబాహుడైన ఒక ఆచార్య పురుషుడు మా ఇంటికి రావడం జరిగింది. నేను రచించిన శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పం, శ్రీ లక్ష్మీనరసింహ వ్రతకల్పం పుస్తకాలు తీసుకుని తాను మా ఇంటి దగ్గరలో గల కాలనీలోని ఒక రామాలయం నుంచి వచ్చానని చెప్పాడు. శ్రీరామవ్రతం తప్పక రాయమని నాతో అన్నాడు. నేనేదో ఆలోచిస్తుండటంతో అతడు మళ్ళీ ఇదేమాట చెప్పాడు. తప్పక ఆ శ్రీరామచంద్రులవారి వ్రతం రచించవలసింది అని అన్నాడు. నేను ఆ స్వామి అనుగ్రహం కాగానే రాస్తాను అని అన్నాను. అటుతర్వాత ఆలోచిస్తే ఆ ఆచార్యులవారు చెప్పిన ప్రదేశంలో శ్రీరాములవారి ఆలయం ఉన్నట్లు నేనెప్పుడూ విననేలేదు.

ఇంకా ఆశ్చర్యమేమిటంటే మళ్ళీ త్వరలో వస్తానన్న ఆయన ఇప్పటిదాకా తిరిగి రాలేదు. బహుశా శ్రీరామచంద్రుడే ఆ రూపంలో వచ్చి దర్శనమిచ్చాడని అనిపిస్తూ ఉంటుంది. మరో విశేషమేమంటే ఈ సంఘటన జరిగిన సంవత్సరమే నాకు భద్రాచల సీతారామచంద్రులవారి కళ్యాణం అక్షింతలతోపాటు ముత్యాలు కూడా అప్పటిదాకా ఏమాత్రం పరిచయం లేని భక్తులు తెచ్చి ఇవ్వడం జరిగింది. శ్రీ స్వామివారి కళ్యాణ ముత్యాలు నేను చూడటం అదే మొదటిసారి.

మరొక విశేషమేమంటే ఈ వ్రత పుస్తకం డిటిపి జరుగుతున్నప్పుడు అనుకోకుండా శ్రీ స్వామివారి జన్మనక్షత్రమైన పునర్వసు నక్షత్రంనాడే జరగటం నాభాగ్యంగా భావిస్తాను. తిరుపతిలోని శ్రీ కోదండరామస్వామివారి దేవాలయంలో పవిత్రోత్సవాలు జరుగుతున్న చివరిరోజు కూడా ఇదే కావటం ఎంతో విశేషంగా భావిస్తున్నాను.

ఈ శ్రీరామరక్ష వ్రతం పూర్తిగా ఆ స్వామి అనుగ్రహంతోనే రచించడం జరిగింది. కలం పట్టుకున్నది నేనైనా ప్రతీ అక్షరం ఆ స్వామి అనుగ్రహంగానే భావిస్తున్నాను. ఈ వ్రతం ఆచరించటం ఎంతో సులభం. ఆచరించిన ప్రతి ఒక్కరికీ ఆ శ్రీ సీతారామచంద్రులవారి అనుగ్రహం కలగాలని ఆ స్వామిని మనసారా వేడుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని చక్కగా డి.టి.పి. చేయించి అచ్చు వేయించిన శ్రీ వాసవీ ప్రింటర్స్ శ్రీమతి & శ్రీ పి.జగదీష్‌కు ఆ శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహం ఎల్లప్పుడూ ఉండాలని ప్రార్థిస్తున్నాను. ఈ పుస్తక ప్రథమ ముద్రణకి సహకరించిన శ్రీ జి.వి.ఆర్.రవి, శ్రీమతి విజయలక్ష్మి గార్లకు (VR Associates, Hyd.) నా కృతజ్ఞతలు. ఇదంతా కూడా కేవలం స్వామివారి ప్రేరణ అనుకుంటున్నాను. వీరికి, వీరి కుటుంబ సభ్యులందరికి ఆ శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహం ఎల్లప్పుడూ ఉండాలని ప్రార్థిస్తున్నాను.

ఈ పుస్తక రచనకు ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ సహకరించిన ప్రతి ఒక్కరికి ఈ వ్రతకల్పం ఆచరించిన మీకు, వ్రత కథలు విన్నవారికి, ప్రసాదం స్వీకరించినవారికి సకల ఆయురారోగ్య సౌభాగ్యాలు కలగాలని ఆ శ్రీ సీతారామచంద్రులను ప్రార్థిస్తున్నాను.

సర్వేజనా సుఖినోభవంతు ః

**శ్రీ సీతారామచంద్ర కటాక్ష సిద్ధిరస్తు**

**సమస్త సన్మంగాళానిభవంతు ః**

తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి

హైదరాబాద్.

04-08-2013

# ఈ వ్రతం ఎలా ఆచరించాలి?

- ఈ పుస్తకాన్ని ఎవ్వరైనా, ఎప్పుడైనా, వయసుతోగానీ, కులంతోగానీ నిమిత్తం లేకుండా పఠించవచ్చును. స్త్రీ, పురుష భేదం లేదు, ఏ నెలలోనైనా, ఏ రోజులలోనైనా చదువవచ్చును. ఏకాదశి, పౌర్ణమి తిథులందు గానీ, పునర్వసు, శ్రవణా నక్షత్రంనాడు కానీ పఠిస్తే మరింత శుభప్రదం. బుధవారం కానీ శనివారం నాడు చదివితే చాలా మంచిది. చైత్ర, వైశాఖ, శ్రావణ, కార్తీకమాసాలయందు ఈ వ్రతం ఆచరిస్తే జన్మజన్మల పాపాలు నశిస్తాయి. ఎంతో పుణ్యఫలం కలుగుతుంది. ఈ వ్రతం ఆచరించే రోజున ఉపవాసం తప్పక ఉండాలనే నియమం లేదు.

- ఈ వ్రతం ఆచరించేముందు ఒక్కసారి మనస్సులోనే గణపతికి, నవగ్రహదేవతలకు, అష్టదిక్పాలకులకు నమస్కరించవలెను. అటుతరువాత మీ పేరు, మీ కుటుంబ సభ్యుల పేర్లు, గోత్రం మనస్సులో తలచుకొని వ్రతం మొదలుపెట్టవలెను. శ్రీ సీతారామచంద్రుల అష్టోత్తర నామాలు పఠించాలి. శ్రీ స్వామివారి అథాంగపూజ చేసి తరువాత ఈ పుస్తకంలోని ఐదు కథలను చదివి స్వామివారికి ఏ ఫలమునైనా నివేదింపవచ్చును.

- ఈ వ్రతం ఆచరించేటప్పుడు భార్య, భర్తలు ఇద్దరూ తప్పక కలిసి ఆచరించాలనే నియమం లేదు. భర్తకు వీలున్నప్పుడు భర్త, భార్యకు వీలున్నప్పుడు భార్య, ఇలా ఎవరి వీలును బట్టి వారు ఆచరించవచ్చును. వీలున్నప్పుడు ఇద్దరూ కలిసి ఆచరింపవచ్చును.

- దురదృష్టవశాత్తు భార్యను కోల్పోయిన పురుషులు కానీ, భర్తను కోల్పోయిన స్త్రీలు కాని కూడా నిరభ్యంతరంగా ఈ వ్రతం ఆచరింపవచ్చును. ఈ వ్రతం ఆచరించినవారికి పూర్తి మనశ్శాంతి కలుగుతుంది.

- ప్రతి శనివారం ఈ పుస్తకంలోని ఐదు కథలను చదివి స్వామికి అరటిపండు, వడపప్పు, పానకం నైవేద్యం పెట్టి స్వీకరిస్తే ఎటువంటి అనారోగ్యమైనా వెంటనే తొలగిపోతుంది. ఎటువంటి ఆపదలూ కలుగవు, అపమృత్యుభయం ఉండదు. చదివే శక్తిలేనివారికి, వారి బంధువులెవరైనా చదివి వినిపించినా, ఎంతో ఫలం కలుగుతుంది.

- ప్రతీ శనివారం శ్రీ సీతారామచంద్రులవారి ఆలయంలో అర్చకులచేత ఈ పుస్తకం పఠించబడితే ఆ ఆలయాలు మహా మహిమాన్వితమైన దివ్యక్షేత్రాలుగా పేరొందుతాయి. అక్కడకు వచ్చే భక్తులందరికీ శ్రీ సీతారామచంద్రులవారి అనుగ్రహం కలిగి సుఖశాంతులతో జీవిస్తారు.

- శ్రీ శ్రీరామచంద్రుని ఏ దివ్యక్షేత్రంలోనైనా ఈ వ్రతం ఆచరిస్తే కొన్ని కోట్ల జన్మల పాపఫలం నశిస్తుంది. వ్రతం ఆచరించిన వెంటనే శరీరంలోని రోగాలన్నీ తొలగిపోతాయి. శరీరానికి నూతన తేజస్సు కలుగుతుంది. దీర్ఘాయుష్షుతో సుఖంగా జీవిస్తారు.

- దూరదేశాలలో ఉండే మీ పిల్లల నిమిత్తం, మీ బంధువుల నిమిత్తం మీరు కూడా చదువవచ్చును. వారికి సంతానం, వివాహం, ఉద్యోగం, ఆరోగ్యం కొరకు ఈ పుస్తకాన్ని వరుసగా మూడు శనివారాలు స్వామివారి ఆలయంలో కానీ మీ గృహంలో కానీ చదివితే వెంటనే ఫలితం కలుగుతుంది.

- వీలున్నప్పుడు ఈ వ్రతం పురోహితుని సహకారంతో ఆచరిస్తే మంచిది. కలశస్థాపన చేసి అష్టదిక్పాలకులను, నవగ్రహదేవతలను, లోకపాలకులను మండపంపై ఆయా దిక్కులలో ఆవాహన చేసి పూర్తి విధానంతో ఈ వ్రతం చేస్తే శుభప్రదం.

- ఏదైనా శుభకార్యం తలపెట్టినప్పుడు ఈ వ్రతం ఆచరిస్తే శ్రీరామచంద్రులవారి అనుగ్రహంతో ఆ కార్యం విజయవంతమవుతుంది. మనస్సు అశాంతిగా ఉన్నప్పుడు కానీ, ఏదైనా అనుకోని కష్టం కలిగినప్పుడుకానీ, తిథి, వార, నక్షత్రాలతో నిమిత్తం లేకుండా ఈ వ్రతం ఆచరించవచ్చు. ఆ స్వామి అనుగ్రహంతో మనస్సు ప్రశాంతమై ఆ కష్టం వెంటనే తొలగిపోతుంది.

ఈ విధంగా ఏ రీతిలోనైనా, ఏ రోజైనా, ఈ పుస్తకం పఠించి శ్రీ సీతారామచంద్రులవారి అనుగ్రహం పొందవచ్చు.

– తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి

## అథాంగ పూజ

| | |
|---|---|
| ఓం శ్రీరామాయ నమః | పాదౌపూజయామి |
| ఓం శ్రీరామభద్రాయ నమః | జంఘేపూజయామి |
| ఓం శ్రీరామచంద్రాయ నమః | జానునీపూజయామి |
| ఓం శ్రీ శాశ్వతాయ నమః | ఊరూపూజయామి |
| ఓం శ్రీ కటవల్లభాయ నమః | కటంపూజయామి |
| ఓం శ్రీ దశరథాత్మజాయ నమః | ఉదరంపూజయామి |
| ఓం శ్రీ కోసలేయాయ నమః | నాభిం పూజయామి |
| ఓం శ్రీ లక్ష్మణాగ్రజాయ నమః | వక్షస్థలం పూజయామి |
| ఓం శ్రీ కౌస్తుభాభరణాయ నమః | కంఠం పూజయామి |
| ఓం శ్రీ రాజ రాజాయ నమః | స్కంధౌ పూజయామి |
| ఓం శ్రీ కోదండ ధరాయన నమః | బాహు పూజయామి |
| ఓం శ్రీ భరతాగ్రజాయ నమః | ముఖం పూజయామి |
| ఓం శ్రీ పద్మాక్షాయ నమః | నేత్రే పూజయామి |
| ఓం శ్రీ సర్వేశ్వరాయ నమః | శిరః పూజయామి |

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

సర్వాణ్యాంగాని పూజయామి

# శ్రీ రామాష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

శ్రీరామాయ
రామభద్రాయ
రామచంద్రాయ
శాశ్వతాయ
రాజీవలోచనాయ
శ్రీమతే
రాజేంద్రాయ
రఘుపుంగవాయ
జానకీవల్లభాయ
జైత్రాయ
జితామిత్రాయ
జనార్ధనాయ
విశ్వామిత్రప్రియాయ
దాంతాయ
శరణత్రాణతత్పరాయ
వాలిప్రమథనాయ
వాగ్మినే
సత్యవాచే
సత్యవిక్రమాయ
సత్యవ్రతాయ
వ్రతధరాయ
సదాహనుమదాశ్రితాయ
కోసలేంద్రాయ
ఖరధ్వంసినే
విరాధవధపండితాయ
విభీషణపరిత్రాత్రే
హరకోదండఖండనాయ
సప్తతాళప్రభేత్త్రే
దశగ్రీవశిరోహరాయ
జామదగ్న్య
    మహాదర్పదళనాయ
తాటకాంతకాయ
వేదాంతసారాయ
వేదాత్మనే
భవరోగస్యభేషజాయ
భూషణత్రిశిరోహర్త్రే
త్రిమూర్తయే
త్రిగుణాత్మకాయ
త్రివిక్రమాయ
త్రిలోకాత్మనే
పుణ్యచారిత్రకీర్తనాయ
త్రిలోకరక్షకాయ
ధన్వినే
దండకారణ్యకర్తనాయ
అహల్యాశాపశమనాయ
పితృభక్తాయ
వరప్రదాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
జితామిత్రాయ
జగద్గురవే
ఋక్షవానరసంఘాతినే
చిత్రకూటసమాశ్రయాయ
జయంతత్రాణవరదాయ
సుమిత్రాపుత్రసేవితాయ
సర్వదేవాది దేవాయ
మృతవానరజీవనాయ
మాయామారీచహంత్రే
మహాదేవాయ
మహాభుజాయ
సర్వదేవస్తుతాయ
సౌమ్యాయ
బ్రహ్మణ్యాయ
మునిసంసుత్తాయ
మహాయోగినే
మహోదారాయ
సుగ్రీవేప్సితరాజ్యదాయ
సర్వపుణ్యాధిక ఫలాయ
స్మృతసర్వాఘనాశనాయ
ఆదిపురుషాయ
పరమపురుషాయ
మహాపురుషాయ
పుణ్యోదయాయ
దయాసారాయ
పురాణపురుషోత్తమాయ
స్మితవక్త్రాయ
మితభాషిణే
పూర్వభాషిణే
రాఘవాయ
అనంతగుణగంభీరాయ
ధీరోదాత్తగుణోత్తమాయ
మాయమానుషచారిత్రాయ
మహాదేవాదిపూజితాయ
సేతుకృతే
జితవారాశయే
సర్వతీర్థమయాయ
హరయే
శ్యామాంగాయ
సుందరాయ
శూరాయ
పీతావాసనే
ధనుర్ధరాయ
సర్వయజ్ఞాధిపాయ
యజ్వినే
జరామరణవర్జితాయ
విభీషణప్రతిష్ఠాత్రే
సర్వాపగుణవర్జితాయ
పరమాత్మనే
పరంబ్రహ్మణే
సచ్చిదానందవిగ్రహాయ
పరస్మైధామ్నే
పరాకాశాయ
పరాత్పరాయ
పరేశాయ
పారణాయ
పారగాయ
అవారాయ
సర్వదేవాత్మకాయ
ఓం పరస్మై

ఇతి శ్రీరామాష్టోత్తర శతనామావళిః

# శ్రీ సీతాష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

శాంతాయై
మహేశ్వర్యై
నిత్యాయై
శాశ్వత్యై
పరమాయై
అక్షరాయై
అచింత్యాయయై
కేవలాయై
అనంతాయై
శివాత్మనే
పరమాత్మికాయై
జానక్యై
మిథిలానందాయై
రాక్షసాంతనిధాయిన్యై
రావణాతకర్యై
రమ్యాయయై
రామవక్షస్థలస్థితాయై
ప్రాణేశ్వర్యై
ప్రాణరూపాయై
ప్రధానపురుషేశ్వర్యై
సర్వశక్త్యై
కలాయ
కాష్ఠాయై
జ్యోత్స్నాయై
ఇందుమహిమాస్పదాయై
పురాణ్యై
చిన్మయ్యై
పుంసామాద్యాయై
భూతాంతరూరిణ్యై
భూతాంతరాత్మనే
కూటస్థాయై
మహాపురుషసంజ్ఞితాయై
స్వవార్యాయై
కార్యజనన్యై
బ్రహ్మాస్యాయై
బ్రహ్మాసంశ్రయాయై
వ్యక్తాయై
ప్రథమజాయై
బ్రాహ్మ్యై
మహత్యై
జ్ఞానరూపిణ్యై
మహేశ్వర్యై
సముత్థానాయై
భుక్తిముక్తి ఫలప్రదాయై
సర్వేశ్యవర్యై
సర్వవర్ణాయై
నిత్యాయై
ముదితమానసాయై
వాసవ్యై
వరదాయై
అవాచ్యాయై
కర్త్ర్యై
సర్వార్థసాధనాయై
వాగీశ్వర్యై
సర్వవిద్యాయై
మహావిద్యాయై
సుశోభనాయై
శోభాయై
వంశకర్త్ర్యై
లీలాయై
మానిన్యై
పరమేష్ఠిన్యై
త్రైలోక్యసుందర్యై
జ్ఞానసుందర్యై
కామచారిణ్యై
విరూపాయై
సురూపాయై
భీమాయై
మోక్షప్రదాయిన్యై
భక్తార్తినాశిన్యై
భవ్యాయై
భవవినాశిన్యై
వికృత్యై
శాంకర్యై
శాస్త్ర్యై
యక్షగంధర్వసేవితాయై
వైశ్వానర్యై
మహాశీలాయై
దేవ సేనాప్రియాయై
భర్తృసేవాపరాయణాయై
గుహవత్సాలాయై
హిరణ్మయ్యై
మహాదాత్ర్యై
సంసారపరివర్తికాయై
సుమాలిన్యై
సురూపాయై
తారిణ్యై
వాదిన్యై
ఓం ప్రభాయై
జగత్ప్రియాయై
జగన్మూర్త్యై
శ్రీమూర్త్యై
అమృతాశ్రయాయై
నిరాశ్రయాయై
నిరాహారాయై
పతిభక్తివిరాజితాయై
శ్రీసత్యై
శ్రీమత్యై
శ్రీశాయై
శ్రీనివాసాయై
హరిప్రియాయై
శ్రీకర్యై
భక్తానుకంపాయై
శ్రీధరాయై
జనకాత్మజాయై
పురావేదావతీరూపాయై
సదాహనుమదాశ్రితాయై
సరసామృతదాత్ర్యై
శ్రీపట్టాభిరామ ప్రియాంగనాయై

ఇతి శ్రీ సీతాష్టోత్తర శతనామావళిః

## శ్రీరామ ద్వాదశ నామములు

ప్రథమం శ్రీధరం నామ । ద్వితీయం దశరథాత్మజం
తృతీయం రామచంద్రం చ చతుర్ధం రావణాంతకం
పంచమం లోకపూజ్యం చ షష్ఠం శ్రీ జానకీ ప్రియం
సప్తమం వాసుదేవం చ శ్రీరామం చాష్టమం తథా
నవమం పాలచంద్రం చ దశమం లక్ష్మణాగ్రజం
ఏకాదశం చ గోవిందం ద్వాదశం సేతుబంధనం.

# శ్రీరామ రక్షా వ్రతం

## మొదటి అధ్యాయం

## విక్రమవర్మ కథ

శ్రీరామచంద్రుడు ఆశ్రితజన వత్సలుడు. నమ్మినవారిని నిత్యం రక్షించే అమృతమూర్తి. తన భక్తులంటే ఎంతో అనురాగం, ఆప్యాయత కలవాడు. భక్తవత్సలుడైన ఆ స్వామి తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి అనే భక్తునికి ఈ వ్రతం అనుగ్రహించారు. ఈ వ్రతం నిర్మల మనస్సుతో ఆచరించినవారికి సర్వసౌభాగ్యాలూ కలుగుతాయని స్వామి సెలవిచ్చారు. ఈ వ్రత కథలు విన్నవారికి, ప్రసాదం స్వీకరించినవారికి కూడా ఎటువంటి ఆపదలూ కలుగవు. తలపెట్టిన అన్ని కార్యాలయందు జయం కలుగుతుందని స్వామి సెలవిచ్చారు.

పూర్వకాలంలో కళింగరాజ్యాన్ని విక్రమవర్మ అనే రాజు పరిపాలిస్తుండేవాడు. విక్రమవర్మ ఎంతో గొప్ప రామభక్తుడు. తన దేశాన్ని రామరాజ్యంలా తీర్చిదిద్దాలని ప్రయత్నించేవాడు. విక్రమవర్మ పాలనలో రాజ్యం ఎంతో సుభిక్షంగా ఉండేది. తాను నమ్ముకున్న ఆ రామచంద్రుడే ఈ రాజ్యాన్ని కాపాడుతున్నాడని తలచి ప్రతి సంవత్సరం శ్రీరామనవమి ఉత్సవాలు ఎంతో భక్తిశ్రద్ధలతో నిర్వహించేవాడు. వాడవాడలా శ్రీ సీతారాములవారి కళ్యాణం ఎంతో వైభవంగా జరిగేది. దేశమంతటా ఆ పదిరోజులు పండగ వాతావరణం నెలకొని ఉండేది.

అన్ని భోగభాగ్యాలు ఉన్నప్పటికీ విక్రమవర్మకి సంతానం లేకపోవటం ఎంతో బాధాకరంగా ఉండేది. సంతానం కోసం రాజదంపతులిద్దరూ ఎన్నో పూజలు చేశారు. ఎన్నో పుణ్యక్షేత్రాలు దర్శించారు. కానీ ఫలితం లేకపోయింది. రోజులిలా జరుగుతుండగా ఒకనాటి రాత్రి విక్రమవర్మకి కలలో ఒక శిథిలమైనటువంటి ఆలయం కనిపించింది. అదేమిటో రాజుకు అర్థం కాలేదు. మరునాడు ఉదయం విక్రమవర్మ ఆస్థానపురోహితుడిని

పిలిచి తనకు వచ్చిన కల గురించి చెప్పాడు. ఆ కలకు అర్థం ఏమై ఉంటుందని అడిగాడు. పురోహితుడు కనులు మూసుకుని ధ్యానించి రాజుతో ఇలా అన్నాడు. రాజా! నీకు కలలో కనిపించింది పురాతనమైన శ్రీరామచంద్రులవారి ఆలయం. ఇది మనదేశంలోనే ఎక్కడో ఉండి ఉంటుంది. నీవు ఆ ఆలయాన్ని తిరిగి చక్కగా కట్టిస్తానని మ్రొక్కుకుంటే మీకు తప్పక చక్కటి సంతానం కలుగుతుంది అనే అన్నాడు. మరి ఆ ఆలయం ఎక్కడిదో ఎలా తెలుస్తుందని రాజు అడుగగా ఆ పండితుడు ఆ విషయం కొన్ని రోజులలోనే తెలుస్తుందని అన్నాడు. విక్రమవర్మ పురోహితుడు చెప్పినది విని, శ్రీరామచంద్రులవారిని మనస్సులో ప్రార్థించి తనకు సంతానం కలిగితే ఆ ఆలయం తప్పక పునరుద్ధరిస్తానని మ్రొక్కుకున్నాడు.

ఇది జరిగిన కొన్ని రోజులకే మహారాణి గర్భవతియై చక్కటి కుమారుని ప్రసవించింది. అతడికి రామవర్మ అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచసాగారు. కాలక్రమంలో రాజు శ్రీరామచంద్రులవారికిచ్చిన మాట మరచిపోయాడు. ఒకనాడు ఒక గ్రామాధికారి వచ్చి తన గ్రామంలో గల పురాతన రామాలయాన్ని తిరిగి పునరుద్ధరించడానికి ధనం కావాలని అడిగాడు. అలాగేనని అన్నాడేకానీ, విక్రమవర్మ అతడికి ధనం పంపించటం కూడా మరచిపోయాడు. తాను ఇదివరలో శ్రీరామచంద్రులవారికి ఇచ్చినమాట కూడా గుర్తుకు రాలేదు. ఇలా ఉండగా ఒకనాడు రామవర్మకు తీవ్రమైన అనారోగ్యం కలిగింది. రాజవైద్యులు ఎవరూ ఆ జబ్బు ఏమిటో కనిపెట్టలేకపోయారు. ఇంతలో ఆ దేశానికి ఒక సాధువు వచ్చాడు. మహామంత్రి ఆ సాధువును రాజమందిరానికి రప్పించి, రాకుమారుడు రామవర్మకు వచ్చిన అనారోగ్యం గురించి అడిగాడు. అప్పుడు ఆ సాధువు మహారాజు విక్రమవర్మతో ఇలా అన్నాడు. రాజా! నీదేశంలో శ్రీరామగిరి అనే ఊరుంది. అక్కడ ఉన్న శ్రీరామచంద్రుని అర్చిస్తే నీ పిల్లవాడిలో మార్పు వస్తుంది అని అన్నాడు.

విక్రమవర్మ మరునాడే బయలుదేరి శ్రీరామగిరి వెళ్ళి అక్కడ వేంచేసి యున్న శ్రీ సీతారామచంద్రులవారిని దర్శించి తిరిగి ప్రయాణమయ్యాడు. మధ్యలో కీకారణ్యం వచ్చింది. చీకటి పడటంతో తన పరివారంతో రాత్రి అక్కడే విశ్రమించాడు. ఒకరాత్రి వేళ ఎక్కడినుంచి వచ్చిందో కానీ ఒక కోతి వచ్చి మహారాజు ప్రక్కనే దూకింది. ఎంతమంది భటులు ఉన్నా తన గుడారంలోకి ఆ కోతి ఎలా వచ్చిందో ఆ రాజుకి అర్థం కాలేదు. అది రాజు చెయ్యి పట్టుకుని ముందుకు లాగసాగింది. విక్రమవర్మ ఒక్కసారిగా భయకంపితుడైనప్పటికి ఈ కోతి ఏదో చెప్తున్నట్లు తోచింది. ఆ కోతి రాజుని గుడారంనుంచి

బయటకు తీసుకువచ్చి అరణ్యంలోకి తీసుకెళ్ళసాగింది. రాజు ఏమీ అనక దానివెంటనే వెళ్లాడు. అలా కొంతదూరం వెళ్లగానే ఎదురుగా ఉన్న కోతి పక్కనే ఉన్న చెట్టుపైకి దూకి క్షణంలో మాయమైంది. రెండు అడుగులు ముందుకు వేసిన విక్రమవర్మకు ఒక అద్భుతం కనపడింది. కొన్ని సంవత్సరాల క్రితం తనకు కలలో కనపబడిన శ్రీరాములవారి శిథిలాలయం గుర్తుకు వచ్చింది. సందేహం లేదు! ఆ కలలో కనబడింది ఇదే. ఈ ఆలయమే అని మహారాజుకు వెంటనే ఆనాడు శ్రీరామచంద్రులవారికి ఇచ్చినమాట గుర్తుకు వచ్చింది. తనకు ఈ ఆలయం చూపించినది సాక్షాత్తూ రామభక్తుడైన ఆంజనేయునిగా గ్రహించాడు.

తిరిగి గుడారానికి వచ్చిన రాజు మహామంత్రికి జరిగిన సంగతి చెప్పాడు. ఉదయమే అందరూ ఆలయం వద్దకు వెళ్లారు. మహారాజు ఆ ఆలయాన్ని వెంటనే పునరుద్ధరించాలని ఆదేశించాడు. తిరిగి నగరం చేరుకున్న విక్రమవర్మకు కుమారుడు రామవర్మ పూర్తి ఆరోగ్యవంతుడై కనపడ్డాడు. ఆ శ్రీరామచంద్రులవారికి ఇచ్చిన మాట నిలబెట్టుకోకపోవటం వలననే అనారోగ్యం కలిగిందని అనుగ్రహించాడు. ఆ స్వామి అనుగ్రహం తిరిగి కలిగినందుకు సంతోషించాడు. రాజాజ్ఞ ప్రకారం ఆ అరణ్యంలోని శ్రీరాములవారి ఆలయం అద్భుతంగా నిర్మించబడింది. అక్కడికి చేరడానికి చక్కటి మార్గం కూడా ఏర్పాటు చేయటం జరిగింది. ఒక సుముహూర్తాన శ్రీ సీతారామచంద్రులవారి మూర్తులు పునఃప్రతిష్టింపబడ్డాయి. అనతికాలంలో అది ఎంతో మహిమగల పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధి పొందింది. అక్కడ కొలువై వున్న శ్రీ సీతారామచంద్రులు తమను సేవించినవారికి సర్వ సౌభాగ్యాలూ అనుగ్రహించే అమృతమూర్తులుగా పేరొందారు.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

# శ్రీరామ రక్షా వ్రతం

### రెండవ అధ్యాయం

## మల్లన్న దివ్య కథ

రామ ఏవ పరబ్రహ్మ రామ ఏవ పరం తపః
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మతారకం

రాముడే పరబ్రహ్మము, రాముడే పరమ తపస్సు, రాముడే పరతత్త్వము, రాముడే తారకబ్రహ్మము, సర్వజీవులకూ ఆధారభూతుడైన శ్రీమన్నారాయణుడే త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా వెలిశాడు. ఆ భక్తవత్సలుడు విశ్వపతి అనే భక్తునికి అనుగ్రహించిన శ్రీరామ రక్షా వ్రతంలోని రెండవ అధ్యాయంలోనికి వెళదాము.

పూర్వకాలంలో రామాపురం అనే గ్రామంలో హనుమత్, లక్ష్మణ సమేత శ్రీ సీతారామచంద్రుల వారి ఆలయం ఉండేది. ఆలయం ఊరికి ఒక చివరగా, ప్రక్కన చక్కటి కోనేటితో చూడటానికి ఎంతో ఆనందకరంగా ఉండేది. ప్రతీ సంవత్సరం శ్రీరామనవమికి ఎంతో పెద్ద ఎత్తున ఉత్సవాలు జరిగేవి. అలాగే ప్రతీ సంవత్సరం ప్రక్కన ఉన్న కోనేరులో శ్రీ స్వామివారి తెప్పోత్సవాలు అంగరంగ వైభవంగా జరిగేవి. అక్కడ కొలువై ఉన్న శ్రీరామచంద్రులవారి పరివార మూర్తులు ఎంతో సుందరంగా, ఆ వైభవం చూడటానికి రెండు కళ్ళు చాలవన్నట్లుగా ఎంతో మనోహరంగా ఉండేవి.

ఆ ఆలయంలో మల్లన్న అనే పనివాడు ఉండేవాడు. మల్లన్న రోజూ ఉదయమే లేచి ఆలయం ఊడ్చి శుభ్రం చేసేవాడు. పేదరికం వలన ఏమీ చదువుకొనలేక ఇక్కడ ఆలయంలో చేరి ప్రతిరోజూ ఎంతో శ్రద్ధగా ఆలయానికి సంబంధించిన పనులన్నీ చేసేవాడు. ప్రతిరోజు ఉదయాన్నే స్వామికి నమస్కరించేవాడు. భార్యా, కుమారునితో

కలిసి ఆలయం ఆవరణ ప్రక్కనే ఒక గుడిశెలో ఉండేవాడు.

ఇలా ఉండగా ప్రతి ఏడులాగానే ఈసారి కూడా శ్రీరామనవమి ఉత్సవాలు వచ్చాయి. ప్రతిరోజు పండగే. ఆలయం మొత్తం రంగు రంగుల పూలమాలలతో అలంకరించారు. మల్లన్నకు ఒక్క క్షణం కూడా తీరిక లేదు. ప్రతిరోజూ సాయంకాల వేళల్లో పురాణ కాలక్షేపం జరిగేది. ఒక్కొక్కరోజు ఒక్కొక్క పండితుడు వచ్చి పురాణాల గురించి అనేక విశేషాలను ఎంతో చక్కగా వివరించేవాడు. నిత్యం ఎందరో భక్తులు వచ్చేవారు. మల్లన్న కూడా పక్కగా నుంచుని ఆ ప్రవచనాలన్నీ వినేవాడు.

నవమి నాటి ముందురోజు సాయంత్రం పక్క ఊరి నుంచి వచ్చిన శంకరశాస్త్రి అనే మహాపండితుడు శ్రీరామనామం యొక్క విశిష్టతను వివరిస్తూ ఇలా చెపుతున్నాడు. ఈ సృష్టిలో రామనామంతో సమానమైన దివ్యనామం మరొకటి లేదు. ఒక్కసారి రామనామాన్ని జపిస్తే ఎన్నో వేల జన్మల పాపం నశిస్తుంది. ప్రతిరోజు ఈ దివ్య నామాన్ని జపించేవారికి సర్వ సౌభాగ్యాలూ కలుగుతాయి. ఎటువంటి ఆపదలో ఉన్నా ఒక్కసారి రామా అని పిలిస్తే ఆ కోదండరాముడు ఆ భక్తుని తక్షణం ఆ ఆపదనుండి రక్షిస్తాడు. ఇంత తేలికైన ఇంత ప్రభావవంతమైన నామం మరొకటి లేదు. సాక్షాత్తూ పరమేశ్వరుడు కూడా ఈ రామనామాన్నే జపిస్తూ ఉంటాడు. సర్వదేవతా గణమూ ఈ అద్భుత రామనామాన్నే నిత్యం జపిస్తుంటారు. ఈ రామనామ జపం వలననే ఎందరో మునీశ్వరులు తమ తమ దివ్యశక్తులు పొందారు. సర్వవేళలా మానవులకు, దేవతలకు ఈ రామనామమే ఆధారం. అని అన్నాడు.

శంకరశాస్త్రి వారిమాటలు మల్లన్న హృదయంలో ఎంతో లోతుగా తాకాయి. తాను నిత్యం సేవ చేస్తున్న రాములవారి నామం ఇంత గొప్పది అన్నమాట. ఏదో చేస్తున్నానన్నమాటే కానీ ఇంత అద్భుతమైన శ్రీరాములవారిని సేవిస్తున్నట్లు గ్రహించలేకపోయానే అని అనుకున్నాడు. ఆనాటి రాత్రి భోజనం చేసి కుటుంబం అంతా నిద్రపోయారు. ఒక్కసారి మల్లన్న కుమారుడు గట్టిగా అరిచాడు. ఆ అరుపుతో మల్లన్న అతని భార్య ఒక్క క్షణంలో లేచి పిల్లవాడికి ఏం జరిగిందా అని చూశారు. పిల్లవాడు కాలుపై చూపుతూ బాధతో మెలికలు తిరుగుతున్నాడు. ఇంతలో ఒక పాము జర జర పాకుతూ గుడిశెలోంచి బయటకు వెళ్ళటం వారికంట పడింది. జరిగింది అర్థమైంది. ఆ పామే పిల్లవాడిని కాటు వేసింది, ఇంత అర్థరాత్రివేళ ఈ పిల్లవాడిని తీసుకుని ఎటు వెళ్లడం? అసలే పిల్లాడు బాధతో కేకలు పెడుతూ కదలలేని స్థితిలో

ఉన్నాడు. మల్లన్న దంపతుల ఇద్దరి పరిస్థితి కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

అప్పుడు మల్లన్నకు ఒక్కసారిగా మనస్సులో సాయంత్రం శంకరశాస్త్రిగారు ప్రవచనంలో చెప్పిన మాట గుర్తుకువచ్చింది. ఎటువంటి ఆపదలో ఉన్నా రామా అంటే ఆ స్వామి కాపాడతారని అన్నారు కదా అని తలచి వెంటనే కుమారుడికి పాము కాటు వేసినచోట రామా అని గట్టిగా అరుస్తూ నోటితో ఊదాడు. అంతే! అద్భుతం! ఆ పిల్లవాడి నొప్పి క్షణంలో మాయమైంది. పాము కాటువేసినచోట గాయం కూడా మాయమైంది. పిల్లవాడు లేచి నవ్వుతూ నిల్చున్నాడు. అది చూసిన మల్లన్న దంపతుల ఆనందానికి అవధులు లేవు. రామా రక్షించావా తండ్రీ! అని ఆ స్వామిని ఎంతో కొనియాడారు. మరునాడు నవమి నాటి శ్రీ సీతారాముల కల్యాణాన్ని కనులారా వీక్షించి ఎంతో ఆనందించారు. జీవించినంతకాలం ఆ దంపతులు ఆ స్వామినే సేవిస్తూ గడిపి చివరన ముక్తిని పొందారు. రామనామానికున్న మహత్తు అంతటిది. ఎవరైతే మనస్ఫూర్తిగా ఆ దివ్యనామాన్ని జపిస్తారో వారు ఎంతటి ఆపదలో ఉన్నా క్షణంలో కాపాడబడతారు. నిత్యం ఈ నామం జపించేవారికి ఎటువంటి అనారోగ్యం కలుగదు. సర్వ సౌభాగ్యాలూ కలుగుతాయి.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

# శ్రీరామ రక్షా వ్రతం

## మూడవ అధ్యాయం

## రామశర్మ కథ

పూర్వకాలంలో గోదావరీ తీరంలో రామశర్మ అనే మహా పండితుడు ఉండేవాడు. అన్ని శాస్త్రాలలోను ఎంతో పాండిత్యం గడించినప్పటికీ అహంకారం ఏమాత్రం లేక వినమ్రంగా ఉండేవాడు. రామశర్మకు శ్రీరామచంద్రుల వారంటే అపరిమితమైన భక్తి. ఎల్లప్పుడూ ఆ రామచంద్రునే మనస్సులో తలుస్తూ ఉండేవాడు. తన దగ్గరకు సలహాలకోసం వచ్చే వారందరికీ ఆ రాముడినే కొలవమని చెపుతుండేవాడు. ఎటువంటి ఆపదలనుంచైనా కాపాడే అద్భుతదైవం ఆ రామచంద్రుడే అని చెప్తుండేవాడు.

రామశర్మ భార్య వైదేహి. దంపతులిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. వారికి వనజ, గిరిజ అనే ఇద్దరు కుమార్తెలు. ఇద్దరికీ యుక్తవయసు వచ్చింది. ఇంక మంచి వరుడిని చూసి కుమార్తెలిద్దరికీ వివాహం చేయాలని ఆ దంపతులు సంకల్పించారు. ఇద్దరికీ మంచి వరులు లభించేలా అనుగ్రహించమని ఆ శ్రీరామచంద్రుడుని వేడుకున్నారు. ప్రయత్నాలు ముమ్మరం చేశారు.

ఆ రామచంద్రులవారి దయవలన కొద్దిరోజులలోనే పెద్దకుమార్తె వనజకి మంచి చక్కటి సంబంధం దొరికింది. ఊరికి దగ్గరలోని గ్రామంలో ఉండే శ్రీనివాసశర్మ కుమారుడు విష్ణుశర్మతో వివాహం నిశ్చయమైంది. శ్రీనివాసశర్మది కూడా రామశర్మ లాగానే చక్కటి కుటుంబం. రామశర్మ గురించి వారెంతో విని ఉన్నారు. ఏ కట్నకానుకలూ లేకుండా వివాహం చేసుకుంటామని అన్నారు. రామశర్మ దంపతులు ఇంత చక్కటి కుటుంబంతో వియ్యం అందగలగటం ఆ శ్రీరామచంద్రులవారి అనుగ్రహంగా భావించారు. వనజ, విష్ణుశర్మల వివాహానికి మంచి ముహూర్తం నిశ్చయించారు.

ఇక రేపే వివాహం. ఆరోజు ఉదయానికల్లా మగపెళ్ళివారి బృందం వచ్చింది. మర్నాడు ఉదయం 7 గంటలకు ముహూర్తం. రాత్రి భోజనాలయ్యాయి. రెండు ప్రక్కల వాళ్ళు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లలు అటూ ఇటూ పరిగెడుతూ ఆటలాడుకుంటున్నారు. ఇంతలో ఉన్నట్టుండి పెద్ద గాలి దుమారం లేచింది. దాంతో పాటు వర్షం కూడా ప్రారంభమైంది. పెళ్ళికోసం వేసిన పందిళ్ళు తడిసిపోసాగాయి. రామశర్మ గుండెలో గుబులు పట్టుకుంది. ఏమిటీ అకాలవర్షం? అందరికీ ఎంత ఇబ్బందిగా ఉందో కదా అని బాధపడ్డాడు. వర్షం ఇంకా పెద్దదయింది. గాలి కూడా తోడై పక్కన ఉన్న చెట్లన్నీ ఊగిపోసాగాయి. ఈ వర్షం ఇలాగే సాగితే పెళ్ళి పందిళ్ళు కూడా ఇంక ఎక్కువసేపు నిలిచేలా లేవు. ఇదంతా చూసి బాధపడుతున్న రామశర్మకు ఆ శ్రీరామచంద్రుడే గుర్తుకు వచ్చాడు. రామశర్మ మనసులో ఆ స్వామిని ఇలా ప్రార్థించాడు. ఓ శ్రీరామచంద్రా! పరంధామా! పావననామా! ఏమిటి తండ్రీ ఈ వైపరీత్యం! నేనేమి పాపం చేశానని నాకీ శిక్ష విధించావు. కుమార్తె పెళ్ళి నీ అనుగ్రహంతో చక్కటి వరునితో కుదిరిందని ఎంతో సంతోషపడ్డాను. ఎంతో వైభవంగా జరుగుతుందని ఆశించాను. ఒక్కసారిగా ఏమిటీ వాన. స్వామీ! ఈ సృష్టిమొత్తం నీ ఆధీనమే కదా తండ్రీ! దయచేసి నా మొర ఆలకించి ఈ వర్షం తగ్గిపోయేలా అనుగ్రహించుతండ్రీ. నీవు తప్ప నాకు వేరే దిక్కు లేదు. నీవే నాకు తల్లీ, తండ్రీ, గురువు, యజమాని కూడాను. నీవే నా సర్వస్వం తండ్రీ. దయచేసి ఈ దీనుని మొర ఆలకించు అని పరి పరివిధాల ప్రార్థించాడు.

భక్తవత్సలుడైన శ్రీరామచంద్రులవారు రామశర్మ మొర ఆలకించాడు. అంతే అంతటి వర్షమూ ఒక్కసారిగా ఆగిపోయింది. గాలికూడా తగ్గింది. ఉదయం ముహూర్తం వేళకు ప్రకృతి అంతా ఎంతో ప్రశాంతంగా, ఆహ్లాదంగా ఉంది. రామశర్మ దంపతులు తమను అనుగ్రహించినందుకు ఆ శ్రీరామచంద్రుని ఎన్నో విధాల స్తుతించారు. వారి కనుల వెంట ఆనందభాష్పాలు రాలాయి. వనజ, విష్ణుశర్మల వివాహం ఎంతో వైభవంగా జరిగింది. కొంతకాలానికి రెండవ కుమార్తె గిరిజ వివాహం కూడా చక్కటి వరునితో శుభప్రదంగా జరిగింది.

శ్రీరామచంద్రుడు ఆశ్రిత జన వత్సలుడు. తనను నమ్మినవారిని నిత్యం కాపాడే అమృతమూర్తి. స్వచ్ఛమైన మనస్సుతో జీవిస్తూ నిత్యం తననే స్మరించేవారిని ఎల్లప్పుడూ కంటికి రెప్పలా కాపాడుతుంటాడు. వారికి సర్వసౌభాగ్యాలూ అనుగ్రహిస్తాడు.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

# శ్రీరామ రక్షా వ్రతం

## నాలుగవ అధ్యాయం

## రామనాథం కథ

పూర్వం గోదావరీ తీరంలో రామనాథం అనే జాలరి ఉండేవాడు. నదిఒడ్డునే ఉన్న మత్సకారుల పల్లెలో గుడిసె వేసుకుని భార్యా, పిల్లలతో సుఖంగా జీవిస్తుండేవాడు. తోటి జాలర్లతో కలిసి నదిలో చేపలవేటకు వెళ్ళి దొరికిన చేపలు అమ్ముకుంటూ ఉండేవాడు. అతనికి శ్రీరాముడంటే ఎంతో ప్రాణం. జాలర్ల గూడెం పక్కనే ఒక రామాలయం ఉండేది. ప్రతి సంవత్సరం అక్కడ శ్రీరామనవమి ఉత్సవాలు ఎంతో వైభవంగా జరిగేవి. మత్స్యకారులందరూ వీటిని రాములోరి ఉత్సవాలు అని ఎంతో భక్తిభావంతో పిలుచు కునేవారు. రాములోరి ఉత్సవాలకోసం గూడెం అంతా ఎదురుచూసేది. ఎన్నో సంబరాలు జరిగేవి. జనం చుట్టుపక్కల గ్రామాలనుంచి వచ్చేవారు.

జాలర్లగూడెంలో అందరికీ రాములోరితో ఎంతో అనుబంధం. వారి పిల్లలకు రాములమ్మ అని, రామలక్ష్మి అని పేర్లు పెట్టుకునేవారు. మగపిల్లలకు అన్నీ శ్రీరామనామాలే పెట్టేవారు. శ్రీరామచంద్రుడితో వారిబంధం విడదీయలేనిది. తమకు ఏ కష్టం వచ్చినా ఆ రామునికే చెప్పుకునేవారు.

రామనాథం కూడా అందరిలాగే రాముడంటే ఎంతో భక్తి కలిగి ఉండేవాడు. ప్రతిరోజు చేపలకోసం గోదావరిలోనికి వెళ్ళేముందు రామచంద్రుడికి మనస్సులోనే మ్రొక్కుకునేవారు. ఒకరోజు అలాగే ఆ స్వామికి మ్రొక్కుకుని మరో ఇద్దరితో కలిసి నదిలోకి వెళ్ళాడు. చేపలు ఎక్కువగా దొరకకపోవటంచేత మరింత దూరం వెళ్ళాడు. ఇంతలో ఉన్నట్టుండి కారుమబ్బులు కమ్ముకున్నాయి. పదినిముషాలు కూడా కాకుండానే

పెద్దవర్షం మొదలైంది. ఇంక వెనక్కి వచ్చేద్దామని తలచాడు. కానీ ఆ వర్షం ఇంకా ఎక్కువై పడవమీద నియంత్రణ పూర్తిగా తగ్గిపోయింది. నదిలో ఆటుపోట్లు ఎక్కువయ్యాయి. ఒక్కసారిగా పడవ తలక్రిందులైంది. రామనాథంతో సహా ముగ్గురూ నీట మునిగారు. ఒక్క క్షణం అందరూ ఆ పడవనే గట్టిగా పట్టుకున్నారు. వర్షం జోరుగా పడుతుండటం వలన ఈదటానికి కూడా కష్టంగా ఉంది.

ఎక్కడ నీటిలో మునిగిపోతామోనన్న భయం అందరికీ పట్టుకుంది. రామనాథం వెంటనే తాను నమ్మిన రాముడినే తలచుకున్నాడు. స్వామీ! ఈ ఆపదనుండి మమ్ములను కాపాడు తండ్రీ అని ప్రార్థించాడు. అంతే ఆపద్బాంధవుడూ, భక్తవత్సలుడు అయిన రాముడు వారందరినీ కరుణించాడు. నదిలోతుల్లోంచి ఒక్కసారిగా ఒక పెద్దచేప ఒక్క ఊపున వీరి పడవను కిందినుంచి పైకెత్తింది. అంతే పడవ నీటిపైకి వచ్చేసింది. వర్షం కూడా తగ్గుముఖం పట్టింది. రామనాథం ఎంతో సంతోషించి ఆ శ్రీరామచంద్రుడిని ఎంతో ప్రార్థించాడు. అందరూ క్షేమంగా తిరిగి గూడెం చేరారు. ఆ సంవత్సరం ఉత్సవాలలో రామనాథం మరింత ఉత్సాహంగా ఆడి పాడాడు.

శ్రీరామచంద్రుడు ఆశ్రిత భక్త వత్సలుడు. తననే నమ్మి కొలచినవారిని నిత్యం రక్షించే అమృతమూర్తి. వారికి ఏ శాస్త్రాలూ, ఏ పాండిత్యమూ అవసరం లేదు. ఎంతటి పామరుడైనా సరే. తనను నమ్ముకుంటే చాలు. ఎటువంటి ఆపదనుంచైనా క్షణంలో కాపాడతాడు. అంతటి భక్త పరాయణునికి ఇవే మన నమస్కారములు.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

# శ్రీరామ రక్షా వ్రతం

## అయిదవ అధ్యాయం

## రాఘవాచార్యుల దివ్య కథ

పూర్వకాలంలో రాఘవపురంలో వీరరాఘవాచార్యులు అనే అర్చకుడు నివసించేవాడు. ఆ ఊరిలోని శ్రీ సీతారామచంద్రులవారి ఆలయంలో అర్చకత్వం నిర్వహిస్తూ ఎంతో నియమ నిష్టలతో జీవించేవాడు. ఆ రామచంద్రుడే తన సర్వస్వంగా భావించేవాడు. శ్రీరాముని గుణగణాలను ఎవరైనా చెప్తుంటే విని ఎంతో సంతోషించేవాడు. ఆ రాముని పేరు వినపడితే చాలు. రాఘవాచార్యుల శరీరం ఆనందంతో ఉప్పొంగిపోయేది. ఆలయ ఉత్సవాలలో ఎంతో ఉత్సాహంగా పాలు పంచుకొనేవారు. ఉత్సవాలు జరుగుతున్నన్ని రోజులు పగలూ, రాత్రి ఆ స్వామి నామం తప్ప మరొక ధ్యాస ఉండేది కాదు.

ప్రతి సంవత్సరం లాగానే ఈ సంవత్సరం కూడా శ్రీరామనవమి ఉత్సవాలు వచ్చాయి. ఆలయాన్ని రంగు రంగుల పూలతో అలంకరించారు. ప్రతిరోజు కొత్త కొత్త పూలు తీసుకువచ్చి మాలలు గుచ్చి ధ్వజస్థంభాన్ని అలంకరించేవారు. రాఘవపురంలో రామనవమి ఉత్సవాలంటే చుట్టప్రక్కల గ్రామాలవారందరికీ పెద్ద పండుగ. ఎక్కడెక్కడినుంచో ఎడ్లబళ్ళు కట్టుకుని వచ్చేవారు. ఊరిలోని వారందరి ఇండ్లు అతిథులతో నిండిపోయేవి. ఊరివారందరూ వారింటికి వచ్చిన బంధువులను ఎంతో ఆప్యాయంగా ఆదరించేవారు. ఆడపిల్లలు రంగురంగుల ముగ్గులు వేసేవారు. మగపిల్లలు వీధులలో మామిడి తోరణాలు కట్టేవారు. ఊరంతా ఎంతో నయనానందకరంగా ఉంది.

ఆ రోజే శ్రీ సీతారాములవారి కళ్యాణం ఎంతో అద్భుతంగా జరిగింది. కల్యాణాన్ని ప్రక్కనే ఉండి జరిపిస్తున్న రాఘవాచార్యులవారు ఎంతో ఆనందపడ్డారు. తరువాత ఆలయ అర్చకులలో పెద్దవాడైన కృష్ణమాచార్యులవారు మాట్లాడుతూ ఇలా అన్నారు. శ్రీ

సీతారాముల కళ్యాణం జగత్తుకే కళ్యాణం. సకల శుభాలకూ సంకేతం. ఈ కళ్యాణం కనులారా వీక్షించిన వారి జన్మ ధన్యం. వారి జీవితాలు ఎంతో శుభప్రదంగా గడుస్తాయి. దేనికీ లోటుండదు అని అన్నారు. ఆరోజు రాత్రి ఉత్సవాలు పూర్తయి అందరూ ఇళ్ళకే వెళ్ళేటప్పటికి పదిగంటలయ్యింది.

మరునాడు ఉదయమే ఆలయంలోనికి వచ్చిన రాఘవాచార్యులవారికి స్వామివారి మూలవిరాట్టు పక్కన ఉండవలసిన ఉత్సవమూర్తులు కనపడలేదు. రాఘవాచార్యులవారు ఎంతో ఆందోళన చెందారు. నిన్నరాత్రి కూడా ఉన్న మూర్తులు ఇప్పుడు ఏమైనట్లు?, ఆచార్యులవారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆలయ పరిసరాలన్నీ వెతికారు. ఎక్కడా ఉత్సవమూర్తులు కనపడలేదు. ఉరుకు పరుగున ఆలయ ధర్మకర్తలమండలి అధ్యక్షులవారి ఇంటికి వెళ్ళి ఈ సంగతే చెప్పారు. ఇద్దరూ కలిసి గుడికి వచ్చారు. బంగారు పూతతో ఎంతో దివ్యంగా ప్రకాశించే ఆ మూర్తులను ఎవరు దొంగలించారో అర్థం కాలేదు.

ఆ రోజు రాత్రి రాఘవాచార్యులవారికి నిద్ర పట్టలేదు. ఎంతటికీ ఆ దివ్యమూర్తులే కంటికి కనపడుతున్నాయి. స్వామి ఎవరు ఇంతటి అఘాయిత్యానికి ఒడి గట్టారు తండ్రీ?. నేనేమి అపరాధం చేశాను స్వామీ! ఏదైనా అపరాధం చేసి ఉంటే క్షమించు తండ్రీ అని కళ్ళనీళ్ళ పర్యంతమై ఆ స్వామిని వేడుకున్నాడు. ఇంతలో తెల్లవారింది. ఆలయానికి బయలుదేరాడు. ఆలయం దగ్గరకు వచ్చిన ఆచార్యులవారు అక్కడ కనపడిన దృశ్యం చూసి నిర్ఘాంతపోయారు.

ఆలయ ఆవరణ గడప లోపల ఒక వ్యక్తి స్పృహ తప్పిపడి ఉన్నాడు. పక్కనే స్వామివారి ఉత్సవమూర్తులు ఉన్నాయి. ఆచార్యులవారు వెంటనే పక్కన వున్న బావినుంచి నీరు తెచ్చి అతడి ముఖంపై చల్లారు. కాసేపటికి ఆ వ్యక్తికి మెలకువ వచ్చింది. ఆ వ్యక్తి వెంటనే లేచినుంచుని రాఘవాచార్యులవారికి రెండు చేతులతో నమస్కరిస్తూ కళ్ళనీళ్ళ పర్యంతమై ఇలా అన్నాడు. స్వామీ! నేను మహా అపరాధం చేశాను. క్షమించండి. మొన్న రాత్రి స్వామివారి విగ్రహాలను దొంగతనం చేసి బయటకు రాబోతుండగా ఏదో శబ్దం అయి వాటిని మరునాడు తీసుకొనవచ్చని తలచి ఆలయ బావిలో పడవేశాను. తిరిగి నిన్న అర్ధరాత్రి వచ్చి బావిలో దిగి ఈ విగ్రహాలు తీసుకుని బయటకు రాబోతుండగా ఆ గడపవద్ద ఒక అద్భుత తేజోమూర్తి గడపకు అడ్డంగా నిలుచున్నాడు. భుజంపై పెద్ద విల్లుతో ప్రకాశవంతంగా ఉన్నాడు. ఆ మూర్తిని ఒక్క క్షణం కూడా చూడలేక, ఆ తేజస్సుకు తట్టుకొనలేక, స్పృహ తప్పి పడిపోయాను. చాలా ఘోరం చేశాను, క్షమించండి అని అన్నాడు.

జరిగిన సంగతి రాఘవాచార్యులవారికి అర్థమైంది. సాక్షాత్తూ ఆ రామచంద్రులవారే ఈ విగ్రహాలు ఆలయం దాటిపోకుండా రక్షించాడు. స్వామీ నిన్ను నువ్వే రక్షించుకున్నావా తండ్రీ అని ఆ స్వామిని ఎన్నో విధాల స్తుతించాడు. ఆ వ్యక్తిని ఆలయ ధర్మకర్తల అధ్యక్షుడి దగ్గరకు తీసుకెళ్ళారు. జరిగినదంతా తెలుసుకుని తప్పు చేసినప్పటికీ ఆ స్వామి దర్శనం అయినందువలన అతడిని క్షమించి వదిలివేశారు. రాఘవాచార్యులవారు విగ్రహాలను తిరిగి ఆలయంలోనికి తీసుకువచ్చి శాస్త్రోక్తంగా పూజలు జరిపారు. కలకాలం ఆ స్వామినే సేవిస్తూ సుఖంగా గడిపి చివరన ముక్తిని పొందారు.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

**శ్రీరామ రక్షా వ్రతం సమాప్తము**

# మంగళ హారతి

రామచంద్రాయ జనక – రాజజామనోహరాయ
మామాకాభీష్టదాయ – మహిత మంగళమ్ ॥ రామ॥
కోసలేశాయ మంద – హాస దాసపోషణాయ
వాసవాది వినుత స – ద్వరద మంగళమ్ ॥ రామ॥
చారు మేఘరూపాయ – చందనాది చర్చితాయ
హార కటక శోభితాయ – భూరి మంగళమ్ ॥ రామ॥
లలిత రత్నమండలాయ – తులసివనమాలికాయ
జలజ సదృశ దేహాయ – చారు మంగళమ్ ॥ రామ॥
దేవకీ సుపుత్రాయ – దేవదేవోత్తమాయ
భావజాత గురువరాయ – భవ్యమంగళమ్ ॥ రామ॥
పుండరీకాక్షాయ – పూర్ణచంద్ర వదనాయ
అండజ వాహనాయ – అతుల మంగళమ్ ॥ రామ॥
విమల రూపాయ వివిధ – వేదాంత వేద్యాయ
సుముఖ చిత్తకామితాయ – శుభద మంగళమ్ ॥ రామ॥
రామదాసాయ మృదుల – హృదయ కమలనివాసాయ
స్వామి భద్రగిరివరాయ – సర్వమంగళం. ॥ రామ॥



ఆపదామపహర్తారం  దాతారం సర్వసంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్



మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్